గోలకొండ పత్రిక

స్వభాను సంగ ఆశ్వీజ శు॥ ౧ గురువారము

# స్థానిక పరిపాలనము

హైదరాబాదు రాష్ట్రములో ప్రవేశపెట్టబడనున్న స్థానిక పరిపాలనములోని పద్ధతియెట్టిదో కనుగొందము. బ్రిటిషిండియాలో ఎన్నికలు కలవు. ప్రజా ప్రతినిధులకే అత్యధిక స్థానాలు. ఏవో కొలాదొద్ది స్థానాలుమాత్రమే ప్రభుత్వమువారి పసందైన మనుష్యులతో నింపబడును. మనరాష్ట్రములో ప్రజాప్రతినిధులు ౫ పాళ్లు ప్రభుత్వ ప్రతినిధులు ౩ పాళ్లు ఉందురట. అయ్యంగారికమిటీ వారు ప్రభుత్వానికి యీ విషయంలో సలహానిచ్చినారు. ప్రతి మునిసిపాలిటీలలోను, ప్రతిపట్టణ సమితులలోను ౧౩ మంది మొత్తము సభ్యులుండవలెనని సిఫారసు చేసిరనియు, కాని ప్రభుత్వమువారే యుదారబుద్ధితో ఆ సంఖ్య చాలదని గ్రహించి దానిని ౨౪ మందిసభ్యులవరకు పెంచిరనియు తెలిపియున్నారు సభ్యులసంఖ్య పెంచుటలో ప్రాధాన్యములేదు. ప్రజాప్రతినిధులకు ప్రభుత్వ ప్రతినిధులకు ఉండే తారతమ్యములో మార్పు కాలేదు. అయిదుపాళ్ళమూడు పాళ్ళపొట్టీ అట్లేయుంచినారు కదా. పైగా అయ్యంగారు కమిటీవారు "ఏసభలోకాని ఏసమితిలోకాని ఉండగల సభ్యులలో సరాసరి సగంసగం హిందూముసల్మానులుండవలెనని సిఫారసు చేసియుండిరా?

౨౪ మంది సభ్యులలో అయిదింట మూడుపాళ్ళుండని ప్రభుత్వమువారు పథకముచేసి, నామకరణముచేసి పంపు తారట. అంటే గణిత శాస్త్రప్రకారం సరిగా లెక్కకుదురుటలేదు. కొంతశేషం వస్తుంది. దానినెట్లు సమన్వయించవలెనో యేమో. అయినా వివాదమునకు తావులేకుండా ప్రభుత్వమువారే ౧౫ మంది ప్రజాసభ్యులనియు ౯ మంది ప్రభుత్వసభ్యులనియు నిర్ణయించి వేసినారు. తొమ్మిదికి తొమ్మిది సాధారణముగా సర్కారీపక్షముగా వోటిత్తురు. అట్టి సమితులపై "మీర్ మజ్లిస్" అనుపేరుతో ఒక "పీఠస్వామి" (చైర్ మెన్) ఉండును. ఆపీఠస్వామి మొదటి తాలూకుదారో లేక రెండవ తాలూకుదారో అయియుండవలెను. అనగా ౧౦ మంది ప్రభుత్వపక్షము ౧౫ మంది ప్రజాపక్షము. అనగా అయిదేఅయిదు తేడా. ఇదిమునిసిపాలిటీల కథ

పట్టణ కమిటీలలో ౬ మంది ప్రజాసభ్యులు ౪ మంది ప్రభుత్వసభ్యులుందురు. వాటికి పీఠస్వాములు రెండవ తాలూకుదారులో లేక తహసీల్దారులో ఉండవలెనని శాసించినారు. అనగా ౬ మంది ప్రజాపక్షము ౫ మంది ప్రభుత్వపక్షము ఒకటేకదా భేదము. "సామకుంమే" అని ప్రభుత్వపక్షమునకు చ్చును. పైగా పీఠస్వామి సర్కారీ అధికారియేకదా! పీఠస్వామిని సభ్యులే ఎన్నుకొను ఆచారమును ఏర్పాటు చేయవలసియుండెను. తాలూకుదారు అంటే గడగడవణికే ప్రజల సభలలో వారిని పీఠస్వాములనుగా ఏర్పాటుచేయుటవలన ప్రజాప్రతినిధులు కొన్నిసమయాలలో నిర్భయముగా తమ ఓట్లను ఇచ్చుకొనజాలరు.

ఇక ఈ మునిసిపాలిటీలు పట్టణ కమిటీలు చేసేపనులేమిటి? బ్రిటిషిండియాలోని మునిసిపాలిటీలకు, జిల్లాబోర్డులకు, తాలూకాబోర్డులకు అధికారాలలో దశాంశముకూడా యీ మన మునిసిపాలిటీలకు పట్టణసమితులకు ఇచ్చినవారుకారు. మురికి కాలువలు కడిగించుట, రోడ్లను ఊడ్పించుట, పాయిఖానాలు ఎత్తివేయుట, చచ్చినవారిని పుట్టినవారిని రిజిష్టరులో వ్రాసుకొనుట ఇవన్నీ మంచిపనులేకాని ఇవి అధికారాలు కావు. ప్రజలు అధికారాలు చెలాయించుటకు ఎప్పుడు నేర్వవలెను. అధికారము చెలాయించేది మీకెందుకు దానికంతా మేము ఉన్నాముకదా అని అంటారా ఆపైతే ఈచిల్లర విషయాలనైనా ఇయ్యండయ్యా అని ఎవరు మొరపెట్టుకొని వాపోయియుండిరి. పైసిమకీబళ్ల బంగ్లాలను మీరు కట్టించవలెను అని అన్నారు. వాటిని నడిపే బాధ్యతమాత్రము వారి పైన లేదు ఆస్పత్రులు, గృహపరిశ్రమలు, ప్రసవాలయాలు, శిశురక్షణాలయాలు, గ్రంథాలయాలు ఇట్టివింకా ఎన్నెన్నో చేయవచ్చునని అన్నట్లున్నది కదా అంటే అవి సమితులయొక్క ఐచ్ఛిక అధికారాలు (Discretionary Powers) అని అన్నారు. అంటే యేమో స్పష్టముకాలేదు.

ఈ సమితులలో జరుగు తీర్మానాలను కొన్నికొన్ని సమయాలలో సుబేదారుగారు రద్దుచేయవచ్చును అని అన్నారు. సర్కారీ అధికారాలవాసన యేఅంతటనుకనబడుచున్నది. మ.ఘ.వ. నిజాంగారి ప్రియమైన విశ్వాసపాత్రులైన ప్రజలకు సంతోషము లేకుండా స్థానికపరిపాలనములోనైనా ఇచ్చినంతమేరకైనా గట్టిఅధికారాలియ్యరాదా? మునిసిపాలిటీలకును, పట్టణ సమితులకును కొన్ని కొత్తపన్నులు వేసే అధికారాలిచ్చినారు ఇట్టి పన్నులలో కొన్ని ముచ్చటమైన పన్నులుకలవు. ఆస్తిపన్ను ఒకటి. రెండవది వృత్తిపన్ను. ఇది ఏ విధముగా యేర్పాటుచేయుదురో తెలుపలేదు. వృత్తులలో వచ్చు ఆదాయముపై పన్ను వసూలుచేయుదురా లేక బ్రిటిషిండియాలోని బోర్డు పెట్టుకుంటే పన్ను, చాకిరేవులో చాకలివాడు బండను పెట్టుకుంటే కుమ్మరివాడు ఆవం పెట్టితే పన్ను, అనునట్టిదో మరెట్టిదో స్పష్టముచేయలేదు, క్రమముగా ఇవి ప్రారంభమైనప్పుడు నిర్ణయముగా తెలియరాగలవు. బండ్లపన్ను తోటపన్ను బాగానే ఉన్నవికాని టోలుగేటు పన్నును రైతుల బడ్ల హద్దువరకు రాష్ట్రమంతటను తీసివేయవలెనని మేము అభిప్రాయ పడువారము. రైతులు భూమిపన్ను లిచ్చుకొంటారు. లోకల్ ఫండుపన్ను లిచ్చుకొంటారు. కరోడగిరీని వారేయిచ్చుకొంటారు. వర్తకులు సుంకము పన్నును లెక్కించుకొని దానిని రైతునెత్తిపైనే రుద్ది రైతులవద్ద సరకులను ఖరీదుచేయుచుందరు. కల్లుసారాపన్నులో సగము కు పైగా రైతులేయిచ్చుకొనుచున్నారని నిర్భయముగా చెప్పుకొనుచున్నాము. ఈ విధముగా ప్రభుత్వానికొన్ని సంపుటకు పనికివచ్చే రైతనే ఈ కామధేనువుపై మరల టోలుగేటు పన్నేమిటి? చదువురాని తిక్కరైతు గ్రామము వదలి పట్నంపోయ్యేవరకు టోలుగేటుపన్ను, బండ్లు ఆగినందుకు పన్ను, మార్కెట్టులోనికి వచ్చినందుకు పన్ను, దళాలీ పన్ను, సాహుకారి ధర్మాదాయంపన్ను, ఈ విధముగా ఎన్నెన్నో పేరులుపెట్టి తిరుపతిక్షౌరం, నిలువుదోపిడీ, చేసిపంపితే వాని గతినిమాచి నవ్వవలెనా ఏడ్వవలెనా తెలియరాకున్నది. యాత్రికుల పన్ను (Pilgrim tax) అను నింకొకటి కలదు. ఇదియు కొన్ని అవస్థలకు హేతువగును ఇది జాతరపన్నా లేక తీర్థస్థానాలకు వెళ్లినవారిపైన వసూలుచేయు తలపన్నా స్పష్టముకాలేదు, ఈ పన్నును వదలివేయుట మంచిది. లేకున్న ప్రజలకు ఇబ్బంది కలుగవచ్చును- పన్నుల అధికారాలు బాగా పసందుగా ఉన్నవి. వాటికేమిన్నీ లోపము కానరాదు. ఏవంవిధగా విశిష్టతతో స్థానిక పరిపాలనము రాష్ట్రములో ముందు రానున్నది.

---

### ని. రా. ఆం. మహాసభ కార్యకారిణీసభ సమావేశము

నిజాంరాష్ట్రఆంధ్రమహాసభ కార్యకారిణీసభ సమావేశము హైదరాబాదు(దక్కన్) నగరములో శ్రీయుత కొండా వెంకటరంగారెడ్డిగారి అధ్యక్షతన ౧౯-౯-౪౮ తేదినాడు జరిగెను. దానిలో దిగువతీర్మానములు అంగీకరింపబడెను.

స్థాయిసంఘముయొక్క ప్రథమసమావేశము వరంగల్లులో ౧౬-౧౭ అక్టోబరు తేదీలలో జరుపవలెను

(౧౧)వమహాసభను ఆహ్వానించిన, కరీంనగరం మెదకుజిల్లాల ఆహ్వానములను ఆలోచించబడెను. మెదకుజిల్లాలో మహాసభజరిపి ౧౫ సంవత్సరములైనందున కరీంనగరంజిల్లాలో మహాసభజరిగి ౩సంవత్సరములైనందున చాలాకాలముక్రిందట జరిగిన జిల్లాయగు మెదకువారిఆహ్వానమును అంగీకరించవలెనని ఈకమిటీవారు బహుసంఖ్యాభిప్రాయము ప్రకారము స్థాయిసంఘమునకు సిఫారసు చేయుచున్నారు

శ్రీఅధ్యక్షులగారిచే తయారుచేయబడినప్రచారకుల నియమములు చర్చింపబడి కొన్నిసవరణలతో అంగీకరింపబడినవి

ఉపనియమముల సంబంధమున శ్రీనందిగామ దత్తాత్రేయరావుగారి లేఖను రాబోవుసమావేశములో ప్రవేశపెట్టుటకు తీర్మానించనైనది.

---

హైదరాబాదు రాష్ట్రములోనికి నిషేధింపబడిన కమ్యూనిస్టు వాఙ్మయమును తయారు ... రానిచ్చుటకు ఆజ్ఞ అయినది

* *

హైదరాబాదు కార్పొరేషనులో లార్డ్ ప్రేమ్జీ చేసినసేవను సభ్యులు మెచ్చుకొని వారిపటము ఆవిష్కరించుట కంగీకరించిరి.

* *

సోమవారం ౨౭ సెప్టెంబరునాడు సాయం ౬ గం. హైదరాబాదు బ్రహ్మసమాజ మందిరములో రామమోహనజయంతి జరుగును.

* *

౧౫౫౭ ఫసలీ ౨౫ తే. నుండి హైదరాబాదు రాష్ట్రములో ఏసంస్థకాని[హైదరాబాదుకమర్షియల్ కార్పొరేషన్ తప్ప]నగరం యటికి బియ్యం, కొర్రలు, సజ్జలు, గోధుమలు, మక్క, శనగలు, చక్కెర అన్నివిధాలపప్పు బయటికిపంపజాలదు. గోధుములలో పిండికూడ అన్నీచేరినవి. వ్యతిరేకంగా వర్తించే వారికి మూడేండ్లశిక్ష, జుర్మానా-ఇకముందులోకల్ ఫండుశాఖవు స్థానిక పరిపాలనంఅని వ్యవహరించవలెను. అని హై. ప్రభుత్వ మాజ్ఞాపించినది.

నేలబొగ్గును వాడుకొనువారికి సెలకు ౩ బస్తాల కంటే ఎక్కువగా అమ్మకూడదు.

* *

ఈసంవత్సరం ఉస్మానియాకళాశాల ఫలితాలు చాలాహీనంగా ఉండినవని ప్రచారం జరిగింది. అదిఅబద్ధమనియు నిజమైనఫలితాలిట్లున్నవనియు, ప్రభుత్వమువారు తెలుపుచున్నారు.

ఇంటర్ పరీక్షలో నూటికి౫౫, ఇంటర్ సైన్సులో ౩౯, బి.ఏ రూ. బియస్సీలో ౭౩ ప్రకారముకడ తేరినారు.

* *

౨౧ తారీఖు తర్వాత చక్కెర కోటాలవద్ద ఏ. ఆర్.సి. పర్మిటుమాత్రమే అంగీకరింపబడును. కాపుర దుకాణందారులు తాము కూపనులనుదాఖల్ చేసి పర్మిటులను పొందగలరు

---

# జనుల గుంపు గవర్నరు కారును తగుల బెట్టెను

## ఆహార ధాన్యముల కఱవువల్ల కలిగిన ఆవేశపు చర్యలు

### పోలీసు లారీ మురుగుకాల్వలోకి త్రోయబడెను

శ్రీనగరు, సెప్టంబరు ౨౬.

జమ్ములో ఆహారధాన్యముల కఱవువల్ల ఆవేశము పొందినజనులగుంపు ౨౩ తేదిన తమఆవేశమును ప్రకటించుటకై ఊరేగింపుజరిపెను. ఆగుంపు నగర పోలీసుస్టేషను సమీపమునచు గవర్నరుకారును తగులబెట్టి, సీనియరు పోలీసు సూపరింటెండెంటుగారికారును చెడగొట్టి, ఒకపోలీసులారీనితగులబెట్టుటకైయత్నించి తుదకుదానిని ఒక మురుగుకాలువలోకిత్రోసిరి-గుంపువంతచెప్పినను వెళ్ళిపోక పోలీసులను ధిక్కరించుచుండుటచే జిల్లా మేజిస్ట్రేటు ఆగుంపుపై తుపాకులుప్రేల్చుటకై ౧౨మంది పోలీసులకు ఆజ్ఞనిచ్చెను- ఇందువల్ల ౧౬నుంది జనులకు గాయములయ్యెను. జనులలో ౭ గురు మరణించిరి. పోలీసులును వారల అధికారులునుకలిసి ౨౫మంది గాయపడిరి.

ఇపుడు నగరములో రాత్రిసంచారమును నిషేధించి సైనికులను కాపలాపెట్టినారు.

ఆహారపదార్థముల కఱవువల్ల కలిగిన బాధను తొలగించుటకై మహారాజాగారు ౫౦వేల రూపాయీలను, మహారాణిగారు ౨౫వేల రూపాయీలను దానమిచ్చినారు-యువరాజుగారిచేత మరొక రూ౧౦వేలు ఇవ్వబడుచున్నవి-

* *

---

## బెంగాలు సహాయార్థం

### వివిధ ప్రదర్శనాలు

హైదరాబాదునగర విద్యార్థినులగు మహిళలు ౧అక్టోబరు శుక్రవారంరాత్రి ౭ గంటలను-డి రెడ్డిహాస్టలులో నాటకం, భారతం, సంగీతం, వాద్యం గీతం, చేయుదురు టికెట్లుపొందవలసినది కోరుచున్నాను.

---

### ధన్యవాదములు

బొంబాయి ౨౩-౯-౪౩

ఆర్యప్రాదేశికసభ హైదరాబాద్ స్టేట్ దక్షిణ కడప శ్రీపూజ్య డి.వి. స్వామి గౌరవప్రచారకులు సుమారు నెలపదిహేనుదినాలు వైదికప్రచారము ఆంధ్రభాషలో చేసి ఆంధ్రులమగు మాకుయెంతో సంతోషము గల్గించిరి స్వామిగారిని పంపించి మాకుచేసిన మేలుకు ఆర్యప్రాదేశికసభకు పూర్ణ ధన్యవాదములు.

పద్మశాలిసంఘ కార్యదర్శి.

---

## సేనలతో వచ్చిన రంగుజాతి ఉద్యోగికి అవమానం

### బ్రిటిషు హోటలులో ప్రవేశము నీయలేదు

ఇపుడు బ్రిటనులో అమెరికను సేనల అనేకములు వచ్చియున్నవికదా! వాటితో వెస్టుఇండీస్ నుండి వచ్చిన టెక్నిషియనులు గలరు. ఆటెక్నిషియనులకు క్షేమాధికారిగా వెస్టుఇండీసునుండియే లియరీ కాన్స్టాన్టయినను రంగుజాతికిచెందినఆయనవచ్చియున్నాడు. ఈయన ఆగస్టునెలలో అందనుక్రికెట్ఆటపోటీలో పాల్గొనుటకై వచ్చియుండెను. ఈయన, ఈయనభార్య, కూతురు లండనులో 'ఇంపీరియల్ హోటలు'నకుపోగా అక్కడ తెల్లజాతివారలు ఉండి రంగుజాతివారిని రానీయుకూడదనిరట. అందువల్ల కాన్స్టాన్టయిను ఆహోటలునుండివెళ్లిపోవలసివచ్చెను ఈసంగతిని రంగజాతుల లీగుయొక్క అధ్యక్షుడగు డాక్టర్ మోడీగారు బ్రిటిషు ప్రభుత్వపు కాలనీశాఖ కార్యదర్శిగారికి తెలియబరచిరి. తర్వాత ఆహోటలుయొక్క మేనేజరు హోంబ్లూవర్ గారు కాన్స్టాన్టయిను తానే హోటలునుండి వెళ్ళిపోయెననియు, ఎవరును వెళ్ళిపొమ్మనలేదనియు చెప్పి, సదరుహోటలులో తెల్లవారలకుమాత్రమే స్థానమనియు, అప్పుడు ఎక్కువగా అమెరికనులు ఆహోటలులో నుండిరనియు. తినకు నల్లవారైనను, తెల్లవారైనను, ఆకుపచ్చవారైనను, పసుపుపచ్చవారైనను ఒకటేననియు, ఆ హోటలు యొక్క పోషకుల అవసరములను తీర్చుటయే తనపనియనియు చెప్పిరి.

యుద్ధముయొక్క చతుర్థ వార్షికోత్సవదినమున బ్రిటిషుప్రాడుకాస్టింగు కార్పొరేషనువారు నాగంటలవేళ వార్తలనువినిపించునపుడు కాన్స్టాన్టయిను "మీరుజాగ్రత్తగాఉండనిచో ప్రతిరోజున్ను అవమానములు జరుగగలవు"అని చెప్పిరి ఈ బ్రాడుకాస్టుతర్వాత అనేకులు సైనికాధికారులున్నూగు వారలనుండి కొన్స్టాన్టయినును వందలకొలది సానుభూతి లేఖలువచ్చెను ఆ గినసంఘటనవుగురించి బ్రిటిషుపార్లమెంటులో ప్రశ్నవేసెననిసన్ హార్బర్టు విలియంసుగారు చెప్పినారు- యుద్ధపుపనికై వచ్చియున్న ఒక బ్రిటిషుపౌరునికి ఇట్లు అవమానము జరుగుట మంచిదనా నాను "అని చెప్పిరి

ఇపుడు కాన్స్టాన్టయిను హోటలులో తనకు భోజనముగాని, వసతిగానిఇవ్వలేదని హైకోర్టులో ఫిర్యాదు దాఖలుచేసినాడు.

---

## ఆంధ్రభాషానిలయ స్థాపన

(ఉ.వి)కురవి, ౧౬-౧౦-౫౩ఫ.

స్వభాను సం॥ భాద్రపద బ॥ ౧౦ మహబూబాదుతాలూకాలోని కురవిగ్రామములో గ్రంథాలయఆవరణలో పురజనులు సమావేశమై నూతన గ్రంథాలయస్థాపనచేసిరి. మొదట గ్రామ ప్రముఖవీర గ్రీనఆమోదములో మహాజనసభ జరుపుటకు అధ్యక్షులుగా వి॥ గోపాల్ రావుడాక్టరుగారిని యెన్నుకొనిరి తదనంతరం మహారాజశ్రీ గంజేపల్లి రామశేషగిరిరావుగారు గ్రంథాలయాభివృద్ధిని గురించి ఉపన్యసించిరి. తదుపరి కార్యదర్శియగు గంజేపల్లినర్సింహారావుగారు యీగ్రామములో గ్రంథాలయము లేనిలోటును ప్రజలకు తెలిపి గ్రంథాలయముయొక్క లాభములను విశదీకరించిరి. సూతక్రీ శేషయ్యగారు గ్రంథాలయమునకు పురజనులు చేయవలసినసహాయమునుగురించి వారితో తోడ్పడుటకు ఆశించిరి తదుపరి కే. శ్రీనివాస రావుగారు బట్టురురంగాచారిగారు విదేశగ్రంథాలయమును గురించి మనదేశపుగ్రంథాలయములగురించి గ్రంథాలయములవల్లకలుగులాభములు తేటతెల్లపరచిరి. అధ్యక్షులవారు తమఉపన్యాసమును పఠనాలయములవల్ల గ్రామాదులలోనుండే రైతులకు ఎట్టిలాభములుకలుగునో తెలుపుచు ఒకసంవత్సరములోపల నూతనగృహనిర్మాణము చేయవలెనని పౌరులకువిన్నవించుచు ఆహ్వానసంఘమువారికి కృతజ్ఞత తెలుపుచు తమఉపన్యాసమునుముగించిరి. తర్వాత ఎన్నికలుజరిపిరి.

---

## శ్రీ చెన్నకేశవాంధ్ర గ్రంథాలయానికి ఉదార విరాళములు

(ఉ.వి)   అర్రూరు ౧౫-౧౦-౫౩ఫ.

గ్రంథాలయ ప్రారంభోత్సవము ఏనుగు రాజిరెడ్డి అత్మకూరుగారి అధ్యక్షతనజరిగినది. శ్రీయుతులు ఆర్, నారాయణరెడ్డి మున్నగువారున్నూ వచ్చిరి. ౩ గంటలకు సభ చేసిరి, టి, వెంకటకృష్ణారావు కార్యదర్శిగారు గ్రంథాలయ పుట్టుపూర్వోత్తరనివేదికను పలికులకు చదివి వినిపించిరి. ఆర్ నారాయణరెడ్డిగారు, గ్రంథాలయముచే గలుగు లాభములు తెల్పి పఠనాలయముగూడ ఏర్పాటుచేయగలందులకు తమఉద్దేశమును వెలిబరచిరి. ఇంకను మరికొందరు పురుషులు, స్త్రీలు ఉపన్యసించినతర్వాత శ్రీ ఆర్. నారాయణరెడ్డిగారు విరాళములప్పుడే వోసంగవలెనని కోరగా శ్రీయుతులు ఏనుగు రాజిరెడ్డిగారు ౨౧౬ రు. టి. చెన్నకృష్ణారెడ్డిగారు ౧౧౬, తుమ్మలనర్సయ్యగారు ౧౧౬, కాలేరురామచంద్రయ్యగారు ౧౧౬ లు, తుమ్మల చిన్నసత్యనారాయణ రెడ్డిగారు ౧౧౬, తుమ్మలనారాయణరెడ్డిగారు ౧౧౬, దేవిరెడ్డినారాయణరెడ్డిగారు ౫౧, తుమ్మలపెదసత్యనారాయణరెడ్డిగారు ౫౦, లక్ష్మణసింగుగరు౫౦, రాజిరెడ్డిగారు౫౦, వెంకటనర్సింహారావుగారు ౫౦రు. తదితరులు తమతమశక్త్యనుసారంగా భూరివిరాళములనొసంగిరి అట్లెది ౧౬౦౦,వరకు సమకూడెను. తుమ్మలనర్సయ్యగారు ఆ,హూను పురసిలాసి ఒక గొప్ప జమీందారుకు. వీరు గ్రంథాలయమునకు విరాళమునొసంగిన నాల్గవవారు ౨రలోకగతులైయ్యేరు కాబట్టి గ్రంథాలయపక్షమున వినినటువంటి బయునను కీర్తిశేషులవారలఆత్మకు సోదర అభిమాన సానుభూతి తెలుపబడినది.

# ఆహారపుకఱవునకు ప్రాణాహుతులు

కలకత్తా, సెప్టంబరు ౨౦

నిన్న ఇక్కడ నగరమందు ఆస్పత్రులలో ౫౯ గురు నిరాహారులు మరణించిరి, ౮౦ మంది వదలి పెట్టబడిరి.

ఢక్కా, సెప్టంబరు ౨౦

సెప్టంబరు ౪ తేదినుండి ఇక్కడ ఆస్పత్రులందు చేర్చబడిన నిరాహారులలో ౨౬ మంది మరణించిరి, ౭ గురు వదలిపెట్టబడిరి.

కుగాయిల్, సెప్టంబరు ౨౦

ఈ పట్టణమందు వీధులలో ౫ గురు మరణించినారు. లోపలి ఊళ్ళనుండి కూడ నిరాహారుల మరణములను గురించిన వార్తలు వచ్చుచున్నవి.

ఇక్కడి ధరలనిర్ణయము ప్రభుత్వపక్షమున తాని తమైన నాటినుండి అంగళ్ళలో బియ్యము దొరుకుట లేదు జనులు సజ్జలు తెచ్చుకొని తినుచున్నారు

మున్షీగంజ్, సెప్టంబరు ౨౦

ఆగస్టునెలలో ఇక్కడ తిండిలేక ౫౪ మంది మరణించినారు. ఆ నెల మొదటి పక్షములో ౩౨ మంది మరణించిరి. వారలలో ౨౧ మంది ముసల్మానులు ౧౧ మంది హిందువులు వీరలందరును దూరగ్రామములనుండి వచ్చినట్టివారలు ప్రతిరోజు వీధులలో నల్గురో అయిదుగురో మరణించుచునేయున్నారు. వారలను ఆస్పత్రులలో చేర్చుచున్నారు.

ఖుల్నా, సెప్టంబరు ౨౦

అడార్ నుండి నిరాహారుల మరణముల వార్తలు వచ్చుచునేయున్నవి. బియ్యము, బొగ్గు, పిండి, చక్కెర మున్నగు ఆహారపదార్థములు దుకాణాలలో దొరుకుట లేదు

కలకత్తా, సెప్టంబరు ౨౧

నిన్న ఈ నగరంలో ఆస్పత్రులలోకి ౧౭౧ మంది నిరాహారులు చేర్చబడిరి, ఆ ఆస్పత్రులలో ౫౪ మంది మరణించిరి.

ఢక్కా, సెప్టంబరు ౨౧

సెప్టంబరు ౪ నుండి ౧౯ తేదివరకు మిట్ఫర్డు ఆస్పత్రిలోకి ౩౦౫ మంది నిరాహారులు చేర్చబడిరి, వారలలో ౩౩ మంది చచ్చిపోయిరి. ౯౦ మంది ఆస్పత్రి వారిచే వదలిపెట్టబడిరి ౭ గురు పారిపోయి కనిపించుట లేదు.

## ఒక నెలలో ౧౩౪౮ మంది మరణాలు

కలకత్తా, సెప్టంబరు ౨౦

బెంగాలు అసెంబ్లీలో ప్రభుత్వమువారి ఆహారవ్యయపత్రమును గురించిన చర్చ ఈ రోజు జరిగినపుడు హీరేంద్రనాథు రాయ్ చౌదరిగారు కలకత్తానగరంలో ఆగస్టు రెండవ పక్షములో ౫౪౯ మంది ఆహారము లేక మరణించిరని చెప్పిరి. సెప్టంబరు నెల మొదటి పక్షములో ౮౦౦ మంది మరణించిరి. జిల్లాలలో పరిస్థితి యింకను అధ్వాన్నముగ నుండవలెనని దీనికంతటికిని కారణము ప్రభుత్వమువారు సరియైన కాలమును రక్షణనొసగక పోవుటయేనని.

ఇదే సభలో ప్రభుత్వాదాయశాఖ మంత్రియగు టి. యస్. ముఖర్జీగారు బాధితులకై ఎంతి సహాయము చేసినదియు అంకెలను తెలుపుచుండగా ప్రభుత్వ ప్రతికూలపక్షసభ్యులు మధ్యలో అడ్డువచ్చి "అంకెలు తెల్పిన ప్రయోజనమేమి? జనము చచ్చిపోవుచున్నారు, అని చెప్పిరి. అధ్యక్షులవారు అందరిని శాంతముగానుండవలసినదని కోరినను ఆ కేకలు అల్లరి కొంతసేపటివరకు ఆగ్లేయుండెను.

సెప్టంబరు ౨౨

కలకత్తా.—నిన్న ఇక్కడ ఆయా ఆస్పత్రులలో ౪౪ మంది మరణించిరి ౪౨ మంది ఆస్పత్రులనుండి వదలిపెట్టబడిరి.

బోగ్రా: —ఈ సెప్టంబరు నెల ౨వ వారములో ఇక్కడి ఆస్పత్రులలో ఇద్దరు మరణించిరి. అందుచే ఇంతవరకు మరణించినవారల సంఖ్య ౩౨ అయినది.

మున్షీగంజ్ —ఈ పట్టణములో రోజు ౧కి నలుగురైదుగురు నిరాహారులై మరణించుచున్నారు.

ఘుబ్రి — పోయినవారములో గౌరీపూరులో ముగ్గురివి, తమర్హాట్ లో ఇరువురివి, ఘుబ్రిలో ఒక్కరిది శవములు రోడ్ల ప్రక్కన పడియుండెను,

రంగపూరు.—తిండిలేక బాధపడుచుండిన ముగ్గురు బాలురు బదరీగంజులో ధర్మవైద్యశాలయొద్దనే మరణించిరి.

సెప్టంబరు ౨౩

కలకత్తా —నిన్న ఈ నగరమందలి ఆస్పత్రులలో నిరాహారబాధగలవారలు ౨౭౪ మంది చేర్చబడిరి. ౫౦ మంది మరణించిరి ౯౭ మంది వదలిపెట్టబడిరి

చాందుపూరు —పురపాలక సంఘమువారికి వీధులలోను, ప్రజలందరు వాడుకొనదగిన స్థలములలోను సెప్టంబరు నెల ప్రారంభమునుండి ౧౪౦ మందికిపైగా మరణించిరి.

ఢక్కా —తిండిలేక ౭౪ మంది, బలము లేక ౧౧ మంది ఢక్కానగరములో సెప్టంబరు ౧౧ తేదితో ముగియు వారమునందు మరణించిరి.

మున్షీగంజునుండివచ్చిన ఒక వార్త ఏమనగా, తిండిలేక మరణించినవారల సంఖ్య ఇంతవరకు ౭౪ వరకు వచ్చినది.

నారాయణగంజులో నిరాహారులు ౨౨ మంది మరణించిరి. చుట్టుప్రక్కల ప్రదేశములనుండి ఆ పట్టణమునకు ౬౦౦౦ మంది పాటివచ్చిరి

మిమ్మెన్సింగులో సెప్టంబరు ౨౦వ తేదివరకు ౫౦ మంది నిరాహారులు మరణించిరి. రోడ్లవెంట ప్రతి రోజు పలువురు మరణించుచునేయున్నారు

ఢక్కాలో నిన్న అడిషనల్ జడ్జిగారి కోర్టుసమీపమందు తిండిలేక మాడుచున్న ఒక చిన్న బాలిక క్రిందపడి మరణించెను. ఆ బాలిక వెంటవచ్చిన సోదరుడు ఆ శవముపైబడి ఏడ్చుచుండగా కోర్టుకు వ్యాజ్యములకై వచ్చినవారలును, వకీళ్లును గుంపుచేరి చూచిరి.

సెప్టంబరు ౨౪

మున్షీగంజ్ — సెప్టంబరు ౨౩ తేదిన తిండిలేక మాడుచుండిన ౧౫౦ మంది లోహగంజునుండి మున్షీగంజుకు ప్రభుత్వోద్యోగులకొఱకై తీసికొనిపోవుచుండిన బియ్యమును తీసికొనిపోనీయలేదు. ఇందువల్ల జనగుంపుతో పోలీసులకు సంఘర్షణజరుగగలదను భయములో సబ్డివిజనల్ ఆఫీసరు ఆ గుంపును శాంతముగ పంపించివేయుటకై పోయెను—

కలకత్తా —కలకత్తాలో అనేకములైన ఆస్పత్రులలో నిన్న ౧౩౭ మంది నిరాహారులు చేర్చబడిరి, ౫౫ మంది చచ్చిరి, ౭౦ మంది వదలిపెట్టబడిరి.

బ్రాహ్మణబారియా ఇక్కడ నిరాహారులకై ఏర్పాటుచేసిన చికిత్సాశాలలో ౨౬ మంది మరణించిరి ఆఖౌరాలో గంజిపోయు ఒక చోట ఇంతవరకు ౪౦ మంది మరణించిరి.

జెస్సూరు-ఇక్కడ సదర్ ఆస్పత్రిలో సెప్టంబరు ౧౮ తేదితో అంతమగువారములో నలుగురు మరణించిరి

సెప్టంబరు ౨౫

కలకత్తా-నిన్న ఇక్కడ ఆస్పత్రులలో ౫౨ మంది మరణించిరి.

మదారిపూరు పట్టణములో వీధులలో చావుల సంఖ్య ఇంతవరకు ౧౦౦ వరకు తేలినది. రోడ్లపై అయినవారు మరణములు లెక్కింపబడుట లేదు.



*****************

## కలకత్తాలో తిండిలేదు మిత్రమండలి గెలిచిన దేశాలకు అన్నదానము

### ధాన్యము ఎక్కువగా మిగిలిన దేశమని కనడా ఖేదము

### లండను పత్రిక విమర్శ

"శ్రీ ప్రెస్ జర్నల్" అను బొంబాయి నగరపు పత్రికకు దాని లండను విలేఖకుడు సెప్టంబరు ౨౫ తేదీని లండనులోని "డెయిలీ హెరాల్డు" అను పత్రిక యొక్క దినపు సంపాదకీయ వ్యాసమందలి ఈ క్రింది భాగమును పంపించినాడు.

"కలకత్తా ఆహారపుకఱవును గురించియు, మరణములను గురించియు వచ్చు వార్తలతో కలిపి సంయుక్తజాతులు జర్మనీ నుండి విమోచన చేసిన దేశములకు అన్నదానము చేయుటకై చేసికొన్న ఏర్పాటును గురించిన వార్తలను చదివినచో పరిహాసముగ నుండును. కనడాలో గోధుమలు ఎక్కువగా మిగిలిపోయినవని అక్కడి ప్రభుత్వము ఖేదపడుచున్నదని చదివినపుడు పరిహాసమనియేగాక క్రూరమని కూడ అనిపించును"

*****************

## మళ్లీ విమానాల దాడులకై ఇండియా సిద్ధముగా ఉండవలెను

ఇండియా ప్రభుత్వపు సివిల్ డిఫెన్సు డైరెక్టరు ఏ-జె రీచుగారు సెప్టంబరు ౨౬ తేదిన క్రొత్తఢిల్లీనుండి బ్రాడుకాస్టు చేయుచు, పోయిన నాలుగు నెలలనుండి ఇండియాపై విమానాల దాడులు జరుగుటలేదని అశ్రద్ధ చేయక ఇండియాలో ముఖ్యమైన చోట్ల జనులు అట్టి దాడులకిప్పుడు సిద్ధముగానే ఉండవలెననిరి.

## సింధుహూర్‌లను అణచుటకైన మిలిటరీ ఖర్చు

### నాలుగుకోట్ల రూపాయీలు

సింధురాష్ట్రములో హూర్‌లను అణచుటకై సైనిక శాసనమును ఒక సంవత్సర కాలమునకు అమలులో నుంచుటవల్ల రోజు ౧కి సగటున ౧౨ వేల రూపాయిలు ఖర్చు అయినని. మొత్తము ౪ కోట్ల ఖర్చు కేంద్రప్రభుత్వముచే భరించబడినది.

మున్షీగంజులో హరగంగా కాలేజ ఆవరణలో మొన్న ఉదయము ఒక శవము కొంత భాగము ఏది యో జంతువుచే కొరుకబడినట్లు కనిపించుచు వీధిలో పడియుండెను.

ఇక్కడి మార్కెటులో బియ్యము దొరుకుటయే లేదు. కొన్నిచోట్ల మణుగుకి ౮౦ రూ. లకు లెక్కన బియ్యము ధర ఉన్నది. మధ్యతరగతి స్థితిగల జనులు తిండిలేక మాడుచున్నారు

బారిసాలులో పురపాలక సంఘమువారు నేటివరకు ఎవరును అడుగనట్టి శవములను ౧౨౫ తీసివేయించినారు. ఈ శవములకు కారణము నిరాహారుల మరణమని తెలియుచున్నది. ఇట్టివే కారణముల చే భోలా సబ్డివిజనులో అనేకులు మరణించినారు.

దందా వివరాలు
సంవత్సరము చందా 6 వది రూపాయలు
ఆరు నెలలకు „ 3-10-0 „
బ్రిటిషిండియాలో సంవత్సరం చందా కల్దారు
విడి ప్రతిక 0-1-0
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominions
BEST MEDIUM — FOR — ADVERTISFMENT

Volu 18 — Nc41 | *Published on every Monday and Thursday Hyderabad Dn* | 30 9—1943

## భారతదేశములో ఆహారధాన్యముల కఱవు

### విదేశీయులకు కూడ దుర్భరమనిపించుట

భారతదేశములో ఆహారధాన్యముల కఱవును గురించి లండనులో ప్రజల అభిప్రాయము ఇటీవల బ్రిటిషు పార్లమెంటులో ఇండియా మంత్రి అమెరీగారు చెప్పిన మాటల తర్వాత చాలా మారినదని బొంబాయిలోని 'క్రానికల్ జర్నల్' అను పత్రికకు దానిలండను విలేఖరి సెప్టంబరు 21 తేదీన పంపిన వార్తలో నున్నది. అమెరీగారు చెప్పినదానివల్ల కాగల్గునది ఏమియు లేదని ప్రజాభిప్రాయము ఏర్పడినదట. "బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధులు కొను ఆహారధాన్యములు ఏమగుచున్నవని ప్రజలు అడుగుచున్నారట. ఇప్పుడు కెనడాలో గోధుమలు ఎక్కువగానున్నవనియు, ఈ ఋతువు నావ సీసముల ఆకలి బాధను తొలగించవచ్చునని సెప్టంబరు 21 తేదీన ప్రకటితమైన "డెయిలీ ఎక్స్ప్రెస్" పత్రికలో తెలుపబడినదట.

* * *

లండనులో "న్యూస్టేట్స్ మెన్ అండు నేషన్" అను పత్రిక యొక్క క్రొత్త సంచికలో ఇండియాకు వైస్రాయి గారానున్న లార్డువేవెల్ గారి మొదటి పని ఆహారధాన్యముల కఱవును తొలగించుటయై యుండవలెనని సంపాదకీయ వ్యాసములో చేయబడినది. కలకత్తాలో ఘోరముల వర్ణనను ప్రస్తావించి ఆ సంపాదకీయములో ఈ ఉపద్రవమును తొలగించుటకు ప్రభుత్వము వారు ఏమి చేయుచుండిరి, అని అడుగబడినది. ఇంకను ఈ విధముగ విమర్శ చేయబడినది. "బర్మానుండి బియ్యము రాకుండపోవుటవల్ల ఏమి జరుగునది ప్రభుత్వము వారు ఆలోచింపరైరి. ఇండియాలో సేనలకు కావలసినసరకులను ఎక్కువగా కొని నిలువచేసికొనుటవల్ల ధరలు పెరుగుటకు ప్రోత్సాహము కలిగినది. ......... అనేక ప్రాంతముల బొంబాయి రాష్ట్రములో అనేక చోట్లలో ఇట్టి పరిస్థితి సంభవించినప్పుడు గుంపులు దుకాణముల పైబడి దోచుకొనియుండిరి."

* *

బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభలో సెప్టంబరు 23 తేదీన పలువురు సభ్యులు బెంగాలులో ఆహారపదార్థముల కఱవువల్ల జరుగుచున్న ఘోర సంఘటనలను గురించి ప్రశ్నలడుగగా, ఇండియా మంత్రి అమెరీగారు సమాధానమునిచ్చిరి. వారు ఈ క్రింది విషయములను తెలిపిరి —

"బెంగాలులో వరిపరిగా పంట లేదు. బర్మానుండి బియ్యము వచ్చుట నిలిచిపోయెను. సేద్యగాండ్లు తమ పంటలలో కొంతభాగమును అమ్మరైరి. కొందరు వర్తకులు ధాన్యములను దాచి ఉంచిరి. రాష్ట్రీయావసరములను, జాతీయావసరములను సంఘర్షణ కలిగినది. రాష్ట్ర ప్రభుత్వమువారి పాలనలో నేర్పులోపములుండెను ఇవి బెంగాలులో ఆహారపదార్థములలోపమునకు కొన్ని కారణములు.

"వర్తకులవద్ద ఎక్కువగా మిగిలిపోయియున్న సరకులను అధికారములతో లాగుకొనుటకు శాసనము చేసిరి, కాని ఆ యధికారమును ఆచరణలో పెట్టుటకు ఎక్కువ కాలము అవసరమైనది. అందువల్ల రాష్ట్రములో కొఱవపడియున్న బియ్యమును పంజాబు మున్నగు అన్యరాష్ట్రములనుండి తెప్పించి యివ్వవలసి వచ్చినది. ధరలు మట్టమును ప్రభుత్వాజ్ఞల ద్వారా నిరోధించగా కలకత్తాలో బియ్యముధర మణుగుకు రూ 30లను మించగా, ఈ ఏప్రిలు నెలలో యుద్ధముకన్నముందు మణుగుకు రూ 7 లుండెను. ఇతరరాష్ట్రములలో టోకుధరలు పంజాబులో రూ 10లనుండి మదరాసులో రూ 20ల వరకు ఉన్నవి. కేంద్రప్రభుత్వము వారు కలకత్తాలో రోజుకు 10 టన్నుల గోధుమలను సరఫరా చేయించుచున్నారు.

"ఇప్పుడు బెంగాలు రాష్ట్రము తటకు ఉపద్రవ భయము ఎక్కువగా యున్నది కలకత్తానగరములోను, బెంగాలు రాష్ట్రములోని ఇతర జిల్లాలలోను వారు నాశనమగుచు కనిపించుచున్నట్లు వార్తలు వచ్చినవి. పోయిన నెలలలో కలకత్తాలో జరుగు మరణముల సంఖ్య సాధారణముగా నుండే లెక్కలుంటే నూటికి 30 లెక్కన హెచ్చినది ——

## దహనాలస్యముచే క్రుళ్లుచున్న శవములు

### కలకత్తానగరంలో ఘోరస్థితి

సెప్టంబరు 24 తేదీన కలకత్తా పురపాలక సంఘములోని ఏ.సి మిత్రఅను సభ్యుడు తాను మరియిద్దరు పురపాలక సంఘ [illegible] సెప్టంబరు 21 తేదీ రాత్రి నింతోల్లా శవదహన ఘట్టమునకు పోయినప్పుడగా అక్కడగా తొమ్మిదికూడ దహనము చేయబడక ఎండకు వానకు తడిసి క్రుళ్లిపోవుచుండిన 70 శవములను చూచితిమని చెప్పిరి. ఆ మృతుల యెడ చాల క్రూరచర్యగానున్నదనిరి. ఈ శవములు కలకత్తానగరములోని వేర్వేరు ఆస్పత్రులనుండి తేబడినట్టివని చెప్పిరి. వాటిని ఏ తోకష్టము మీద తాము దహనము చేయించితిమనిరి. సాహానగరు స్మశాన ఘట్టమునందు ఆట్టివి 30 శవములు కనిపించినవనిరి.

అయిన పై మేయరు అగు సయ్యద్ బద్రుద్దోజా గారు అది అవమానకరముగనున్నదనియు, ఈ విషయమును తొందరగా ప్రభుత్వమువారికి తెలిపి శవదహనము తొందరగా జరుగునట్లు చేయుటకై పురపాలక సంఘపు ప్రధాన కార్యనిర్వాహాధికారి వెంటనే ప్రభుత్వమును కోరవలెననియు చెప్పిరి.

## గాంధి మహాత్ముని వచనముల ప్రకటనకు సౌకర్యము

### ముందుగా అధికారులకు చూపించవలెనను నియమపు సడలింపు

గాంధీగారినుండిగాని, వారితో మాట్లాడుటమున్నగు సంబంధముల సౌకర్యములుగల వారలనుండిగాని వెడలు వచనములను పత్రికలలో ప్రకటించుటకు పూర్వము రాష్ట్రీయ ప్రభుత్వపు ప్రెస్ అడ్వైజరు అను అధికారికి చూపవలెనని ఇదివరలో గవర్నమెంటు ఫిబ్రవరి 10వ తేదీ, మార్చి 13 తేదీలలో కలిసి చేసియుండినట్టి ఆజ్ఞ ఏదైతేగలదో దానిని పత్రికలనుండి తొలగించనైనదని బొంబాయి ప్రభుత్వమువారు ఈ సెప్టంబరు 22 తేదీన ఆజ్ఞ చేసిరి



Printed and Published by G. Kamakshi [illegible] Reddy at the Golconda Power Press, Hyderabad-Dn. Editor S. Prathap Reddy, B.A., B.L.